ఈ కావ్యం మొదటిసారి నేననుకోకుండానే ముద్రణ జరగడానికి సహాయులైన రసజ్ఞులు మిత్రులు శ్రీ మంత్రి వెంకటేశ్వరరావుగారే ఈ రెండవ ముద్రణకుకూడా నా జోక్యం లేకుండానే సహాయులు కావడం విశేషం. వారి సరసహృదయోదారతకు నా కృతజ్ఞత.

ఈ కావ్యాన్ని గూర్చి వ్యాసాలు అభిప్రాయాలు వ్రాసిన పత్రికలకు రచయితలకు అభివాదాలు.

దీన్ని విశారద పరీక్షకు పాఠ్యగ్రంథంగా నిర్ణయించి గౌరవించిన శ్రీ ఆంధ్రసారస్వత పరిషత్తువారి కావ్యాదరణకు ప్రణామాలు.

# ప్రథమ

"అడు గిడవే ప్రభాత! హరి
హాసము లావల సేయవచ్చు సం
దడి కిది తావుకాదు సుమ
దామము జాగ్రత లోని కేగగా
జడియగనేల; సజ్జనుల
సంగతిఁ గూర్చి ప్రసంగమెంతయో
నడపితి మింతదాఁక; స్మర
ణంబును వీడు విరామ మేడనే!"

అనుచు సుశీల పయ్యెదఁ గ
రాంగుళులన్ సవరించి ఫాలమం
దున నటియించు ముంగురుల
ద్రోయుచు బైకి, పదంబు లంటుచున్
దొనఁకెడి చీరకుచ్చెళుల
దోయిటఁ బట్టి కుటీరపాళిలో
వినతశుభాంగియై పదము
బెట్టె, ప్రభాతయు వెంట నంటి రాఁ

ఇరువురు వీరె తప్ప, పరు
లెవ్వరు లే, రొక చక్కి మాత్రమే
కరము లిఖించెనో,—నది యొ
కం, డట గట్టున వేణునాళమున్
గరముల నూని మోవి నిడి
గానవిశారదవోలె మూర్ఛనల్
బరపుచునున్న సుందరి,—వి
లాసపు చిత్తరు వొండు తోఁచినన్;

పలికె ప్రభాత "జన్వని! భ
వత్తనువల్లరి లోని రూపు రే
ఖలె ప్రకటించు జిత్తరువు
గాయనమూర్తి వటంచు నేటికిన్
దెలిసెను గోప్యమా, చెలుల
తీరు లిటుండునె, పాడుకొమ్ము, నే
దాలఁగెద" నంచు బోదలఁచు
తొయ్యలిఁ డాసి సుశీల పల్కెడున్.

"కాని పోని తలంపుల కలఁత నొంది
త్రుంచివేతువె సఖ్యంపు తోడిమఁ జెలియ!
భావ మెఱుఁగక తప్పిన బాటలందు
బాధపడి క్రుంది రెండఱో ప్రాణసఖులు.

కమ్మని గోస్తనీరసము
కన్న రుచుల్ పచరించు చిత్రమం
దమ్మలికంపు భేదముల
నాల్కగఁ జేయక చూరగొంద మే

జుమ్మను తేఁటిబోంట్లమయి
సుప్తి లభించెడుదాక, వేరు రా
గమ్ములఁ బాడ నేమిటికి,
కాంచనె చిత్తరువందు దృశ్యమున్.

ఎంతటి భాగ్యమో యమున,
ఎన్ని దినాలు యశోదపట్టి ని
శ్చింతగ వేణునాదమను
శీధువు జిల్కుచు మంత్రించెనో;
సుంతయు బీరువోక మృదు
సూక్తుల నేటికి నాలపించు నే
కాంతరవంబులో, మురళి
హాయిని గొల్పు దటంచువా సఖీ!

గోవులు గోప గోపికలు
కోరిక లీరిక లెత్త బృందయం
దే విభవమ్ముకై మనసు లిచ్చి
పగళ్ళను రేలుఁగూడ మో

దావహావులై రో, ఆ వనరు
హాళి మెరుంగులు తీవెబోంట్ల నీ
రాకృవి చెఱంగులున్ విరుల
రంగులు కన్నులం గట్టునే చెలీ!

మోసులు దేలి పచ్చికలు
మోపగుటన్ తెగమేసిమేసి క్రీ
డానరణిన్ జెలంగుచు, త
టంబులం గ్రుమ్మను కోడె, లావు, లా
యాసకర ప్రవర్తనలె
హాయి సుమా! హృదయంబు మెచ్చి పిరా
దాసవ మాను చోటుల, వి
హారములం దలతల్ స్ఫురింపవో!

పురి విడలించి నెమ్మి, పరి
ఫుల్ల విచిత్ర సహస్రనేత్ర సం
భరిత తృషోపశాంతిం జరుపన్
దలంపెట్టి మెడ న్నిగిడ్చెనా!

సరభస చిత్తవృత్తముల
ఛాయలు మోమున దోఁచు నేల? ఇ
త్తఱి ప్రకటింతె నీ చతుర
తావిదుషీత్వము లింపుగా చెలీ!"

చిటికెనవ్రేలితో జెలియ
చెక్కును మీటి సుశీల పల్కె "దు
ర్ఘటమగు ప్రశ్న వేసితివి
కామిని నీలసుదీర్ఘవేణియం
దెటులో భుజంగియున్న తలఁ
పెక్కగ నెత్తె మెడన్ గ్రసింప, నం
దుట కను వుండమిన్ నిలచె
దూపయినట్టులు వేణి భద్రమే"

అనుచు తట్టె పరిభాత అయ్యాబల యంస
భాగమున్ కేతసవ్వ్యాల సోగకనుల,
ఆపె గ్రహియించి తన వేణివైపు జూచె
వ్రేలుచుండెను ముందు హారాళిలోన.

"సహజకౌటిల్యయుతశిరోజముల నెంత
యణచి దువ్విన సరియగు టరయ గలమె
వక్రగతు లంత సంచారభాసురములో
సరళపథములు కంటక సన్నిభములో.

అనుదిన మా స్థలంబున సు
ధాధర వేణుకలస్వనంబు లే
యనుపమ నీల నీరద శు.
భావహ తేజము రాల్చుచుండ నె
మ్మన మలరింపుచున్ శిఖి స
మాధి విలీన సుఖాన తాఁ వెనో
కనఁబడ దా మహాత్ప్రతిమ
గ్రక్కున దోఁచె తటిత్సజీవద
ర్శన మన నూత్న రాగరమ
రంగులు పూరెను బర్హి మోహమున్

చల్లని శ్యామలామలుని
శబ్దనిషేవణమందు జిక్కి సం

ఫుల్లములైన మొగ్గలును
బోదియలన్ గననీక చుట్టు ప
ల్లెల్లెడ గ్రమ్ము పర్ణముల
హేళియు, నుయ్యెల లూగు పండ్ల కొ
గిళ్ళ హయాయల్, ఎఱుంగుదె స
ఖీ! మరపించిన వేమొ రాధికన్.

తలఁపులు పాఱ వింటివయిఁ,
దన్మయమొందు సుఖానుభూతి ఆ
వల నొనగూడదో, వన ని
వాసమె తియ్యని పున్నమయ్యెనో,
జలము గ్రహింపవచ్చెనని
చాటును భాండము చెంతనుండి, ని
ర్మల మురళీరవంబునకు
మళ్ళెను రాధ హృదాస్థ లెట్టివో?
అనుడు సుశీల, పల్కె నపు
డా కలభాషిణి నవ్వి "ప్రేయసీ!
పనులను పాటలన్ మఱచి
భామిని యీగతి సంచరింప, నే

మనుకొని ధర్మసూత్రముల
నాడి హృదాస్థల నిర్ణయింపగా
జనునో తదీయభారమును
జక్కఁగ నీవె వహింప యోగ్యవే."

మధురతరమగు మాధ్వీకమాణికమందు
గ్రావనిభమగు ఖండశర్కర కరంగు
కరగవలెనని పుష్యరాగమున కేల
ఆర్ద్రహృదయము ప్రాక్తనాహ్లాదఫలమొ

జలదసుకుమారి ముద్దుముచ్చటలతోడ
వానపాలిచ్చి పెంచిన బాలశాఖఁ
గూలజేయుట కేపగ కులిశమునకు
ప్రకృతివైరుధ్యములకు కారణము కలదె?

నిలువు నీరైన తల్లి కన్నీటి బొట్లు
పసచెడిన బిడ్డ కారోగ్య మొసగునేని
పారమే లేదు ప్రేమవాఃపూరమునకు
మానదండంబుఁ గొని చను మాధ్యమేల

పెదవి గదలింపక సుశీల మెదలకున్న
తెరలు తొలగిన విచ్చు కన్దీవులందు
భావవృక్షంపు మోహనప్రసవగతుల
మందమందారవంబులు మనసుఁ గలచు

వజ్రనిర్భిన్నమై బాధపడు నటంచు
రత్నమునుగాంచి వగ గొన రమ్యమగునె
ఏ సుభగవక్షసౌందర్య మినుమడించి
ఎట్టి ప్రణయాంజలికి చోటు నీయగలదొ.

మౌననిశ్చేష్టయౌ సతి మనసునుండి
వెలువడెను వాక్య మొకఁడు గంభీరజలధి
మునిగి తపియించి తెప్పరిల్లిన విధాన
చోద్యమొంది తటస్థగా జూడ చెలియ.

"కటికచీఁకటిపొరల్ గడవఁ ద్రోవను జూపు
దివ్యవిద్యుత్తు సందేహపదమొ
వడసోఁకి నీడకే వాఁచిన దమిఁదీర్పు
నంబుదచయము శంకాస్పదంబొ

కొలని దేటిన నీరములు గ్రోలి నవ్విన
సరసిజాననము సంశయకరమ్మో
పాలానుచున్ పసిప్రేవులఁ జెక్కిలి గిలు
మాతృలాలితుఁ డనుమాన్యుఁ డగునో

విమలహృదయాంతరాళగోళమున వెల్గు
ప్రేమచంద్రుఁడు నిష్కళంకామృతఖని
ఛాయలేయుండ వచట. విశ్వప్రదీప్తి
అనుభవాంజన మెఱుగని కనుల కిరులె.

అది సమత్వప్రాప్తి యొదవుటకై మనో
రాగముఁ వెదజల్లు యోగమేమొ
అది కర్మకౌశలం బిది యని చూప దీ
ర్ఘోగతిఁ బూనిన యోగమేమొ
అది చిత్తవృత్తుల నణచి యేకాగ్రత
నొందుటకై నేర్చు యోగమేమొ
అది పూర్ణసన్న్యాసపదమున డాఁగి బా
హ్యోద్గతమై నిల్చు యోగమేమొ

ఆ విమలదృష్టు లా వినయాతిరేక
సాధుసౌశీల్యనైసర్గికాధివాస
భాసురాకార మే లక్ష్యభావ మగునో
మందమతులనియో తెల్ప మనసుపడవు

లోకజనయిత్రి! రాధికా! రోసి రోసి
కుటిలపంకిలగాఢాంధకూపజగతిఁ
గాలు పెకలించి నిశ్చింతఁ గనెడి తెఱఁగు
లెఱుకపడ వేమొ నీ తత్త్వ మిముడకున్న.

లోకప్రస్ఫుటధర్మవేత్తలు వయో
లోలతత్త్వసిద్ధాంతముల్
కాఁకల్ తీరక లేవనెత్తినను, శం
కాఖడ్గపాణుల్ మన
శ్శోకానగ్నిరక్తకాంక్షులయ్యు సం
క్షోభింప రంగంబునం
దే కోర్కుల్ ధృతిఁగూర్చునే జనని! ని
న్నీ రీతి నవ్వింపఁగన్.



వత్సలుడు

తెలియగలేవా ఏ విమల
తేజము లోనను జేరి నల్ దెసల్
బలసి సమస్త మూర్ఖ దన బ
లంబున గెల్చి నిరంకుశ ప్రభా
విలసితమై జగత్ ప్రళయ
వేదననైన, తృణీకరించు ని
ర్మలహృదయప్రపూర్ణ జయ
మాధురిమల్ ప్రచురింపజేయునో"

అను నుడు లా సుశీల వద
నాంబుజమున్ బయలొంద, గిర్రునన్
గనులను నిల్చు బాష్పజల
కణకణావళి అప్రయత్నతన్
దానికె ప్రభాత మోముపయి
దోషయుతంబులు కాని పల్కు లే
మనసుం గరంగజేయ వను
మాన విదాహము లారిపోవంగన్.

నవనవాలోలచూతపల్లవపు కందుఁ
జీల్చివైచెను పిక మను చింత యేల
కలకలకషాయసురభిళకంఠ మెత్తి
వేణువీణాతిశయగీతి విసరు నేమొ.

ఓపఁగరాని నిందుతమి
నొక్కపరిన్ జెలిఁ గౌఁగలించి "దు
ష్ప్రాపపరీతనై యటుల
బల్కిన నేరము సైపవమ్మ నే
నీపయి వాదులాడ నని
యిద్దియె బాస నొసర్చుదాన సం
తాపము మానవే చెలియ!
నాయెడఁ గూర్మిఁ దలంతు వేనియున్."

అని వచించి ప్రభాత తా ననుఁగు చెలియ
చిబుకతలమును బుడికె లేఁజివురువ్రేళ్ళ,
స్నిగ్ధమతికి సుశీల కన్నీరు జిలికి
ముద్దుముగ్గులు దీర్చెఁ గపోలయుగళి.

ఉగ్గుఁబాల్ ద్రావు చుయ్యాల లూఁగి యూఁగి
పండ్లు మొలకెత్త గుజ్జెనగూండ్లు మెసపి
బొమ్మపెండ్లిండ్ల సూత్రబంధమ్ము నొంది
పెరిగిఁ తఱుఁగని చెలిమి యీ తఱిసి విడునె

మూఁత విడిపోవ పంజరమ్మును గదల్చి
గగనసీమంతినీకంఠ మెగసి కవియ
రెక్క లల్లార్చి పోవు శారిక విధాన
సూనమాల సుశీలకంఠాన నిలచె.

అంత నాయమ హృదయలతాంత మెట్టి
భావలతికలలో జిక్కువడెనో యెఱుఁగ
లేము తేనియఁ బొంగిపిన లేమొ యనగ
పలుకుతునకలు వెడలె ప్రభాతవాణి

"చెలియా! రాలిన పారిజాతములలో
చెన్నొందు ధావళ్యముం
జులతన్ నిల్పిన రాగనాళికల ని
ష్ఠ్యూతంబులయ్యెన్ పరీ

మళిముల్, పీల్చుచు నేర్చి కూర్చితిని. ఈ
మాలాపరిష్వంగవే
ళల నేవైన గవోష్ణతల్ జెలఁగి యు
ల్లం బింత నొప్పించనే

పెండ్లిపిల్లను వరునిచేఁ బెట్టువేళ
వెన్నఁబోలిన హృదయాన కన్నతల్లి
కరఁగి కార్చెడు కన్నీటి కాల్వలందు
వేఁడి యుంట నెఱుంగవో వెఱ్ఱిదాన !

చలి విదల్చెడు మాఘమాసప్రభాత
వేళ తేటఁగా బాఱు కల్లోలినీజ
లంబులం దేలియాడు ధూమం బదేల ?
వెచ్చదన ముంటనే కద పిచ్చిదాన !

పూలరాణి గులాబికై కేలు చాఁచి
ముల్లు సోఁకె నటంచు వాపోవఁ దగునె
మలయచందనతరువును మెలుచుకొనిన
కాలసర్పంపు హృదయ మే కవి గణించు.

ఎండ కెందఱో కోవిదు లెట్టయెదుట
సుతుని గీర్తింప జనకుఁ డసూయ జూపి
యూసుఁ గల్గించు పల్కులనే వచించు
నోర్వలేడేమొ పుత్రికాభ్యుదయ మతఁడు.

కనుఁగవ విన్నఁబోవ ముఖ
కాంతులు నెచ్చట డాఁచినావొ, వి
చ్చిన బువుగుత్తులట్లు విడఁగ
జేయ మొగంబును మోడ్చుకొన్న తీ
వెను గనినట్లు లాయె; తగ
వే! యిఁక లేవె దినంబు లింతి! యా
ననమును విప్పు మింక మఱు
నాఁడు హసించు లతాగతిన్ వడిన్.

ఎప్పుడో పోయిన జీవరేఖ లప్పుడే
యే వెల్గులం జిల్క మిం
టిపయిన్ జేర్చెనో కాంతిపూరములు, నిం
డెన్ నేఁటి కీ భాండికల్,

జపియింపన్ బని లేదు, లెమ్ము చెలి ! యి
చ్ఛాపూర్తి ర మ్మింక; వింత
పనుల్ జేయుద మింపు సొంపు లిగురె
త్తన్ గీర్తనల్ బాడుచున్."

అనెడి మధురానురాగ వేల్లనమువలన
మేలుకొని, సళ్ళిపోయిన మృదువిపంచిఁ
దంత్రులు బిగించి స్వరములు స్థాయిఁ గూర్చి
పోలిక సుశీల ఆత్మను పొదిపి పలికె.

"లలితలలితప్రసూనపాత్రమున స్వాదు
మధుసుధలు నింపి నల్లసి మాయపొరలు
గప్పి నను మోసపుచ్చితె ! విప్పినపుడు
బయలుపడినట్టి శుభ్రశోభ లివి నావి.

ఐన నిది యేమి ? విస్మృతి పాలఁ బడితొ,
తోఁచకుండెనొ భవితవ్యసూచనములు
అల్లితివి పూలదండ నే యాశయమున
నా పవిత్రింపు సత్కృతి నాపఁదలఁతె"

నాఁ విని వే ప్రభాత వద
సంబున విన్నదనంపు వీచికల్
కోవలు కోవలై చెలఁగి
కూతలు కూయ, "వినీలకుంతలా!
పూఁవుల తూఁగు టూయెలల
పోకిళ్లు లింక శమింపలేదు నీ
వే విరిగుంపుతో మురిసె దే
యని లేచె మరాళి పోలికన్,

"ఆచరించితి నేనేమి యఘము లతివ!
అలరు కూనల యాటపాటలను గాంచి
క్రింద కొరగిన బిడ్డల నందికొనుచు
తల్లి నయ్యెద కాసేపు; తరలిపోవ

రమ్మ, జాగేల?" నని సుశీల చెలికరము
కరమునఁ దవిల్చె; సాగి రా కాంత లిర్వు
రుపవనవిలాసశోభల నపనయింప
దీక్ష బూనిన మూర్తి మద్దీప్తు లనఁగ.

# ద్వితీయ

వ్రాలవు నీడ లే దెస క
వారితమై పరతెంచు నాతప
జ్వాలల హవ్యమై తనువు
బాయఁగఁ బ్రాణము లొప్పకుంట, వి
శ్వాలయమందు జీవి యొకఁ
డైన బయల్పడఁ డెంపుసేయఁ డే
మూలల డాఁగెనో తనదు
ముప్పున దా దొలగించు కోర్కులన్.

పవనుని లాలనల్ జెలఁగి
పాపెడుబో వడతాఁకు లన్నచో
నవనవలాడు లేయిగురు
నాల్కల వ్రేలఁగ వైచి వల్లరీ
యువతులు వాడివత్తులయి
యూర్పుల నోర్పులఁ దక్కి రెల్లెడన్;
రవికరతాపమే యిటుల
రాయిడి బెంచ భరింపరాదు ఎ
న్ని విధములైన వహ్నులు వ్రి
ణీతములై దురదృష్టుఁ డేడ్చునో!

వలపువెన్నెలఁ దేఁ్రపిన వయసుపెడఁద
కాలనియతిని వెలుఁగును గోలుపోయి
నిరవధికమైన శూన్యత కిరవగు గతి
సరసులెల్ల మరీచికాకరము లయ్యె.

ఫుడమియిల్లాలి సీటికొం గొడిసి లాగు
తరణి దుండగమును శాంతి పరుపఁ జూచు

జగతిపై కోరచూపుల సెగలు రువ్వి
మండి పడుచుండె నతఁ డెదు రుండ డెవఁడు.

పైరుపచ్చలఁ గులికిన పంటభూమి
సస్యసంపత్తి తొలఁగ విషణ్ణయగుచు
శిథిలమైనట్టి పూర్వప్రసిద్ధ నగరిఁ
దలఁపునకు దెచ్చు తెలియవు దైవకృతులు.

అపు డొక బాటయందు కన
నయ్యె గరంబున దండ మూని, గా
టఁపు చెమటల్ స్రవింప, గడు
డప్పిని రోజుచు, డొక్క లంటు పా
పపు కడు పాకఁటన్ ముడుత
బారి వనారిలు వృద్ధనారి: ఎం
డ పొడలవేడి నాపుట కొ
డంట గనంబడ దొక్క పాతయున్.

పొగ లెగయఁ జేయు వేఁడి దుమ్మున పదంబు
లటులె జరపగ దలపడి యాపె యకట

సోలిపడె; పెళ్ళుమని నేల వ్రీలె నపుడె
దుత్త కాంబోలు ఆబిడ తోడుసీడ.

నికటు సుమవాటిలోని పర్ణకుటి వెడలి
పరుగిడుచు వచ్చె యువకుం డొక్కరుండు వేగ,
చెవుల బడియెనొ భాండికాజీర్ణవిరుతి
దిక్కటుంగని యామె సందేశ మనగ.

మూపుపై వృద్ధకాంతను పొందుపఱచి
దండ మెత్తుక చేరె నాతండు కుటీర
సీమలోనికి, పెన్నిధి చిక్కినపుడు,
తహతహంపడు పేద తొందరను గలిగి.

మృదువగు శయ్యా నాయమను
మెల్లగ జేరిచి శైత్యసేవలన్
పదిలముగా నొనర్చినను
పల్లు గదల్పదు రెప్ప లెత్త దా
ముదుసలి; అట్టి తెన్నునకు
భుగ్నహృదంతరుండై యతండు గ

ద్గదరుతి బల్కె; నెవ్వెసొ వి
శ్వాసములే పొడకట్టు వాక్కులన్.

"తెలియఁగఁజాల మా ప్రకృతి
తీరుచు తీరుపు లీ జగాన, వం
తల గృశియించు ప్రాణిపయి
తారసిలున్ విపదుగ్రపాతముల్
నిలువక నొండు రెండయి గ
ణింపఁగ రానటులై, పరిశ్రాంతునే
బలయునుగాని క్రూరు దలఁ
పన్ సమకట్ట వదేమి పాపమో !

పూట గడవని బీదల పుట్టి ముంచి
సౌధతలముల మెత్తని శయ్యలందు
బింకముల గిల్పు ధనికుల వంక జనవు;
ఎట్టి మోమోటయో వాని కట్టిడోట

పట్టెడు కూడులేక పలు
పాట్లకు లోనయి కుందునట్టి యా

పొట్టకు తోడు నీరయిన
పుట్టక లోనికి నాల్కలాగ ఏ
పట్టును లేక శోషిలి ప్రి
పాతము నొందిన కాయమున్, జరా
ఘట్టన, సూర్యతాపము; ప్రి
గల్భుఁడెపో జగదీశుఁ డిట్టిచో.

మొగ్గలో డాగి పూవున ముడిచికొనియు
పిందెయై కాయ యయ్యు పసందు జిందు
దోరపండయి మాగుడుకారు గడచి
రాలనున్నది, రాల్పగా శూలమేల ?

జగదధిష్ఠానమై యొక్క సత్పదార్థ
ముండనేయున్న సమభావ ముండదెట్లు ?
తనదు సామ్రాజ్యమం దున్కి గనినజీవి
బిడ్డయేకద ! తండ్రి విద్వేషి యగునె ?

పాపపరిణామమను యుక్తి బన్న నేల ?
సత్పథంబుల సంచారశక్తి నిచ్చి;

సాగిపొమ్మని పాథేయ శకల మిచ్చి
ఏకరీతిగ దర్శింప శోక మున్నె !

'భాషలు మూగలై తలలు
వాల్చు తదీయసమగ్రశక్తిని
శ్లేషముగా వచింపదగు
శీలము లేమి' యటందు; రెందు కీ
శోషలఁ ద్రోసి జీవులను
చూర్ణము గాఁగఁ దపింపఁజేయు ఉ
ర్భీషణకృత్యముల్, జగతి
వేపక సౌఖ్యము లీయఁజాలదే ?

నిరతసుఖసాగరము నీఁద మరగి మఱచి
తనదు కృతికి కృతఘ్నులై తలంచ రనెడి
భీతియేమొ ? సకాముఁడే విశ్వనేత !
దేహధారుల కింకెంత తీవ్రకాంక్ష ?

'భూతముల కద్ధి వేఱను బుద్ధి తగదు
అణువు మొదలు నజాండమ్ము దనుక నిమిడి



వత్సలుడు

తానె చూపును తనదు లీలానుభవము
నంతమే లేని రీతుల' నన్ను యెడల;

నిఖిలజగముల నిండిన నిర్మలాత్మ
భూత భూతంబునందు విభూతి నిల్పి
అవిరళానందమే నిత్య మనుభవింప
కేడ్పు లేల ? సదానంద మెట్టు లపుడు?

ఏడ్పునది దేహ మాత్మ కే యేడ్పు లేద
టంచు బల్కిన, సర్వగతాత్మ దేహ
మందు లేకుండెనే, దేహ మాత్మయే మొ,
ఏడ్పునెడ దేహ, మాత్మయు నేడ్చినట్లె.

ఉన్నదనిపించు సృష్టిచిత్రోదయమ్మె
కలదు కలదన్న నిట్టియాగడము లందు
లేదు లేదని నమ్మిక లేకపోవు
నున్నదో లేదో నిశ్చయ మన్న సున్న."

ఇటు లేదో తుదిలేని భావపథమం
దేకాంతసంచారసం

ఘటితంబైన మనంబు నే మనక, ఆ
త్మాకాంతాస్యకాంతార ప
ర్యటనాదక్షత నున్న అక్షులకు జీ
వాంకూరసందర్శన
స్ఫుటమర్యాదను నిర్ణయించి వ్యజనం
బున్ కేల నాడించుచున్

గడియలు యామముల్ కదలి
కాలధునిన్ మటుమాయమైనఁ గాం
చడు వనవాటిఁ బర్విన ప్ర
శాంతపు సాంధ్యరుచిన్, విరన్ జెవిం
బడవో శకుంతసంతతుల
పాటలఁ బొంగు నినాదమాధురుల్,
తడవెను గాని బాలుఁడు సు
తారముగా పృషదశ్వుఁ డేమగున్ !

రేకుల మొగ్గబోను వద
లించుకొనన్ ద్వారపడ్డ సౌరభా

నీకము వోలె చూపుగమి
నేర్పుగ రెప్పల నెత్తి వచ్చుచే
యే కడలందు నిల్వ స్ఫురి
యించెనో వత్సలు మానసాళి
కూరీకృతబాంధవంబయి ప
లిక్కి సమర్పితఁ జేయవచ్చినన్;

ఎదురుఁ దొలంగనీక పెఱ
కోరికలన్ జవిజూడనీక నె
మ్మది బదిలించి వత్సలుఁ డ
మ్మఁగళెముల్ శమియించెనంచు నా
ముదుసలి దేహమున్ నిమిరి
మోముమున గీల్కొని నారచిక్కులా
గొదవెడు మూర్ధజాళి నెగ
నొత్తి కృపామయమ్మైన జూడ్కులన్.

ఆమెఁ గనుగొని "అవ్వ నీకేమి వలయు"
ననఁగఁ గర మెత్తి పెదవుల నంటి చూపె

ఆగు బిపాసయె యని యాతఁడవల నున్న
బానకోనున్న నులివెచ్చ పాలు ద్రాపు.

ఏటినడిదిబ్బఁగల తుంగ నీటివడికి
వ్రాలి యల్లాడి పొంగుహోరంగు తగ్గి
పోవఁదలయెత్తునటు లవ్వ లేవగలిగె
యువకుఁడందిచ్చు చేతులనూఁతఁ గొనుచు.

అటుల గూర్చుండి శయ్యపై నరసి దిశలు
భయమొ విభ్రాంతియో పైన బడినయట్లు
వీడ నుంకించె తల్ప ముద్వేగఘణితి
'వలదు వల' దని వారించి పలికె నతఁడు.

"తల్లి భయమంద నిందు గతం బదేమి ?
అమరిచితి సమ్మ ! ప్రేమతూలమున శయ్య :
కుపసమున డాఁగు క్రూరాహి గుణములుండ
సిరుల ఘట్టల బుసకొట్టు పలుపుకాఁగ.

మెలుఁగుడుఁ బైడిదుమ్మ నును
మేనుల బూఁత లలంది గోసి చి

త్తరువుల వ్రాసి యుంచిన గ
తంపు భవిష్యపు వర్తమానపుఁ
దురిత రహస్యరూపక వి
నోదములందు విదూషకాంశచే
విఱిచిన వంశచూతముల,
ప్రేల్చిన సంపదప్రోగు లెన్నియొ
యెఱుఁగఁగ నీక చిల్కనగ
వీను మదాంధుల దాటి వచ్చితే

జననీ ! లేమిడిముండ్ల శాటుఁ బయనిం
చఁ లేచి నీ వింత దాఁ
టిన లెక్కింపగరాని వెల్లువల, దీం
డ్రింఫుల్ బ్రసారించి త్రోవను
బంధించిన గండుకొండల, గుహా
భాగంబులఁ వీడి యా
ర్చిన మాంసాశనసత్వయూధముల నే
రీ తీర్చువా రొక్కరే ?

ఆ కడగండ్ల పారముల
నబ్బిన నీతులసొమ్ము దాల్చి శో
భాకరమయిన నీమొద బృ
హస్పతి కందని లోతు తేటనా
జూకుల నెన్ని నేర్చినదో,
సూత్రములల్లు తపఃపయస్సు లెం
దాఁక గడించి పెట్టినదొ,
దాఁపకు మమ్మ ! సుతుఁడ నయ్యెదఁ

నీదు హృదయాలయమునందు నిత్యపూజ
లంది, అందాలపిందెయై యనుభవింపు
మాలికలఁ దాల్చి మెఱయు నమాయికంపు
దేని భజియింతు నిర్మలజీవకాంక్ష."

అన విని వృద్ధురాలను "మ
హాత్ముఁడ వెవ్వఁడ వయ్య నే నెఱుం
గను వినలేదు కర్కశజ
గంబున మున్నెపుడైన ప్రేమ భా

జనమగు నీదు స్వాంతపుటి
చన్నైదు దివ్యమరందవాక్కులో
యనఘుఁడ నీవు వత్సలుఁడ
వాఁడవె ! యీ వనవాటి నీదౌనో !"

"ఓ" యని ద్వారదేహళి న
ప్రాంగమునఁ దిలకించె నాతఁ డే
దో నినదంబు వీనులకు
దోఁచిన యట్టులు గాఁగ; నంతఁ జేఁ
బూనిన పళ్లెరంబున స
మున్నతమై కనుపట్టు కోరకా
మ్లానగుళుచ్ఛమో సరిజమొ
మాఁతికి వ్రేళుల జక్కఁ జేయుచున్

సాంధ్యశ్రీశోభల వెలయు వాసంతలక్ష్మి
కావి చివురాకువలువ గైదీవె నోలయ
మాధవుని జేరు సుకుమారమాన్యగతుల
నిలిచె వచ్చి సుశీల వత్సలునియెదుట.

తడయక పళ్ళెరంబు వసు

ధాతలి డించి, వినమ్రముయాచు, నే

బిడియపు తాఁకులఁ మనసు

పేరిముడిఁ జేరఁగనీక; పొంకమై

ముడివిడనట్టి మల్లియలమొగ్గల దండను

మధ్యమధ్యఁ గన్

పడెడు గులాబిగుత్తులు జ

పాసుమముల్ కళలీన, గ్రిందుగా

నడుమను వ్రేలు మాలతుల

నాణ్యపు కుచ్చుల నంటి సంపెగల్

దడఁబడి క్రింది గోరటల

దట్టపు కౌఁగిలి పీడనట్టి, యా

ఒడుపుల పూలదండను శు

భోత్సవదృష్టులఁ దీసి, మెల్ల నా

పడఁతుక వైచె వత్సలుని

భవ్యగళస్థలి నందగింపఁగన్.

దాన గడియించుకొన్న బంధనము బలము
మాన మొడనేసి "చెలియ! యే కోన కరుగఁ
దలఁచి యిటు వచ్చితే దారిఁ దప్పి" యనుచు
బలుకు నాతని నిండుచూపులను ముంచి;

ఎద విదారించు నలుకున నొదిఁగి యొదిఁగి
తలఁపు ప్రతిన 'మాఊహూఫు'లా యనంగ
నశ్రువులు చింది సన్నఁ జెక్కులందు దొరల
నాపె వచియించు వినయామోహాఁపు నసుల.

"ఆత్మ కథ నేత దూర మైనట్టి తజ్ఞని
కనుల ముకుళించి జగతిని గనక, దైవ
వశతఁ బ్రియుఁ డబ్బ 'నళిన! నెవ్వగలఁ గుందు
దేవరికొఊ' కన, బదులది యేమి సెప్పు?

కటికి రాచట్టుగముల గర్కశపు వనుల
భోరుభోరున నేడ్చుచు బోయి, తుదకు
చెలుని గని; కౌగిఁటను జేర్ప జేతులెత్త,
నతఁడు 'మన నేడ' నన ధుని యను నకేమి?

మబ్బుతెర లెండవెలుఁగుల మఱుఁగు పఱచె;
వాఁడిచూపులె కల, వగపడదు నీడ;
నీడ యేమాయె? జలదమె నికృత మగునో
భానుఁడే నిర్దయుండని పలుకవలెనో!"

ఊహాల దొంగిలించి మన
సూఁచు నెలంత గభీరవాక్కుల
వ్యాహృతవృత్తి నాతని దృ
గంచలముల్ జెలిచూపులందు వ్యా
మోహము నొంది లీనమయి
పోవునటుల్ బచరింప; నంతరా
సేహ నెఱుంగ రించుకయు
నిర్వురు గూడ ప్రభాత వచ్చుటన్.

వచ్చిన వచ్చుటే మృదుల
వల్లుల నల్లిన జల్లిబుట్టలో
దెచ్చిన ద్రాక్షలున్ మనసు
తీపిని బెంచు ననంటి మావి పం

ద్గచ్చుట డించి వేగ కుట్రి
యుంపున మున్నె కలట్టి చిత్రముఁ
ముచ్చట లాడఁ జేరె నన
బొందుఁగ నిల్పె మరొక్క చిత్రముఁ.

అంత శయనీయమున వృద్ధ కాంతఁ గాంచి,
కొంత తడవున కాంతని కోమలాస్య
బింబమును గాంచి, మిగుల నిర్విణ్ణయగుచు
శయ్యా కావల మెలమెల్ల జరగి తలఁచు.

“ఈ యనంత వసుంధర మోయు తమము
నందు నడవుచు నిల్చు పాంథాళి కెట్టి
విద్యుదుద్దీపకళికలు వెలుఁగునట్లు
లా మహాయంత్ర మూఢునో యేమి తెలియు.

ఈ మహాంభోధి లేచి గర్జించు బీక
రోర్మిచక్రంపు పొగలలో నుడికి యుడికి
అడుగు బట్టంగ మునిఁగిపోయెడి పదార్థ
లవము లా రాజు నౌకను గవియు నెన్నొ.

ఈ దురంతాగ్నిశిఖలలో నిగిరి యిగిరి
కరుడు గట్టిన జీవవాఃకణము లెన్ని
కరఁగి నిత్యస్రవంతులై గనఁగఁ గనఁగ
ఆ యమృతరాశి పనుచు శీతానిలముల."

# తృతీయం

ఆ విచిత్రపుటనుభూతి నతని యెడంద
ఘూనె సంచారములు నిద్రలేని కలలు;
ఆఁకలి యాటన్న ముసలి వాక్యములు పైని
యదిమి నొక్కైన, గబగబలాడు నతని;

"శ్రమపడంగ నేల? లేమె వత్సలకుమార!"
యనుచు వారించి ఫలముల నంది తెచ్చి
వృద్ధనారిఁ బ్రభాత తిన్పింప దొడగె
మృదులహృదయము నవనీతసదృశ మేమొ!

అంతట వత్సలుండావె దిక్కరసి స్వ
స్థావస్థమున వచ్చు చో
క్కిం తాలస్యము జేసె గాని, యప్పుడే
"ఇంతీ! భవత్ సీమలో
సంతోషంబెకదా సమస్త" మన "వి
జ్ఞానంపు శంపాలతా
స్వాంతజ్యోతికి స్నేహ మే మిడితి! సి
స్సంతోషమా ప్రాజ్ఞుడా!"

అనెనో లేదో ప్రభాత, పల్కెను సుశీల
"సఖుడ! మీ రాధవెనుక నీ శ్యామలుండు
ముగ్ధమోహనసైదగ్ధ్యమూర్తి యగుచు
తొంగి చూచును చూచితే దొంగతనము?"

అపుడు గిర్రున బొంగర మటుల తిరిగి
కనియె వెనుచక్కి నందాత్మజుని నతండు
తీర్చిదిద్దిన శృంగారదీప్తిభగిత
చిత్రఫలకంబునందు విచిత్రగతిని.

ఏ విపినచూత శాఖలం దిగురు గొరికి
గళము సవరించి పాటతీగెలను లాగ
పరుగు లెత్తెనో యాతని భావపికము;
పరవశత నొందు దృష్టిలో బలుక డతఁడు.

చలువ నురువుల తుంపురు లొలుక బోసి
ఏ సుధాధుని తరగలు త్రోసినవియొ
లలితగీతీస్రవంతికాలాపగతుల
పికము నడపించు గళవిపంచికపు రుతిని.

" ఓ మహాభాగ! ప్రేమరాశీ! మనోజ్ఞ
రూపలావణ్యచిత్రప్రతాపవిజిత
నిఖిలవిపులాధిగతవస్తునిచయ! చతుర!
విదితవిద్యాంతరాళ! నీ కిదె నమస్సు.

ఓయి ప్రేమాంబువాహా! నీలోత్పలముల
వన్నె వడిఁగట్టి మెదిచిన చిన్నియొడలు
పైఁడి నిగ్గుల మిలమిలలాడు; రాధి
కాతటిత్ సుమవల్లి చెంగట యిదోహో!

నీవు త్రవ్విన గీతాసరోవరమున
మునుగు సతి యని సంకల్పమును బఠింప
నిచట నిల్చితివే పురోహితుని భాతి!
ఆమె మైజాఱుఁ గాంతు వందేమి యాశ!

నీవు నిల్పిన విశ్వంభరావరణము
కలికితారాహతిఁ నెత్తు రొలుకఁబోయు
కలరు ధన్వంతరులు కోఁతసఖుపు రేఁప;
ఊదవా వంశి? నిక లేదు లేదు మందు.

ఎన్నటి ద్వాపరంబు? గతి
యించితి వెన్నడు గోకులంపు బల్
వన్నెల పూలతోఁట నెడఁ
బాసి శ్మశానపు వాటిఁ జేసి? సి
వున్న దినాల బృంద విబు
ధోపవనం బు పల్లవాళి సం
పన్నసురాళి గోపిక లు
పజ్ఞలు ధేనువు లిందిరాంశలో!

రారాజుల్ బహు భోగభాగ్యముల నా
రాధించి బాహ్యంగ దే
శారమ్యంబుగ సంచరింతు, ఇఁక కాం
తాఘూమమం దాత్మ లే
వే, రాపిళ్ళకు చీకి చిక్కుడివా వె
ల్గే కానరా దింత, బృం
దా రాజ్యంబున గొల్లబోయఁడ వనం
తజ్యోత్స్నఁ బండింతు వే!

లేవు మణుల్ సువర్ణపు విలే
పనముల్ తనువంటి, కానలో
తీవెలు రాల్పగా గొని కు
దర్చిన పూవుల మాలలున్ మయూ
రావమతంబు బర్హము ను
దంచిత దివ్య విభూషణంబులౌ
నీ విమలంపు శోభఁగని
నిల్వున గుల్లరె రాజరాజులున్!

ఏవో నీ తలఁ గుప్పనోసెను పురా
ణేచ్ఛాకవివ్యూహాకం
బే వార్తఁ నిరసించు గాథలు, నిజం
బెట్లందు? కాలాబ్ధిలో
జీవుల్ యాత్రలు సేయఁ వైవఁబడె నీ
చే గాదె గీతోడుపం;
బా వార్తఁ బ్రకటింప నేర్పినవి కా
వా రాధ కా గానముల్ !

'సుఖమో దుఃఖమొ పాలఁబడ్డ దెదియో
శోకింప కుప్పొంగ కీ
నిఖిలాజాండ సమీకరంగమున ని
ర్నిద్రుండవై పుత్ర! క
ర్మఖనిత్వంపు పతాక నిల్పుకొని పో
రఁ జారిపోరాని దే
సుఖశస్త్రంబో పరిగ్రహింపు'మని నీ
సూక్తుల్ ప్రబోధింపవో!

ఒక్కొక్క ప్రక్క వాద్య మది
యొక్క శ్రుతిన్ గొని సాగి పోవఁగన్
చక్కని గానధార చెవి
జారనివేళ పిపాస తీరునే?
లెక్కకు మీరు వ్యాఖ్య లవ
లీల ధ్వనించును, స్థాయి లేదు: నీ
చిక్కని గీత నీకొఱకె
చేతులు సాచెను వేణు వత్తెదే!

'మనసు నవ్యక్తగతిలోనఁ జొనుపు తలఁపు
కలుగునే పుత్రి! అది దుఃఖకరము నిజము
దేహధారివి వెత మున్గి తేల' వనుచు
విప్పి చెప్పిన నీమాట వీడ దెడఁద.

సగుణ నిర్గుణసంశయాస్పదవిచార
వాదభేదంపు చీకఁటి బాట లంటి
మాట గట్టెడి భ్రమలు నా కేటి కోయి?
మనసు నిన్నంటి విడక నెమ్మఁదినె గనును.

అగురువో కావో యే పరమాత్మవైన,
చేయి చాచని నా కా విశేషమేల?
మడుగునకు దూకి పసరాల నడవిఁ ద్రిప్పి
కలఁత నొందని నీ నవ్వు కొలుపు వలపు.

పండువెన్నెల గనని పాపపు మనస్సు
ఝరవిరావము వినని శుష్కపు టెడంద
మధురమకరంద మెఱుఁగని శిథిలమతియు
ప్రేమగంధమ్ము నీ హృదిఁ బిల్చుఁ గలదె?

భువనమోహన భూపాల పుత్రకుఁడవు;
'మండు టెండలఁ జెమటలు పిండు నపుడె
నవ్వరా గొల్ల!' అను బోధనమునకన్న
గొల్లగుంపున నీకేమి కోర్కెలయ్యా!

నీదు త్యాగంబు నీ తృప్తి నీదు సమత
నీ మహత్తరబోధాప్రణీతజగతి
నొక్క పటి గన, హృద్భిత్తి వ్రక్కలగుట
చోద్యమే రాధ కా యాత్మశుద్ధి కతన.

శృంఖలీభూత నీచ సంసృతిని సఱకి
పొంగిపొర్లుచు తనను గొంపోయె నదియొ
తన్మయాపగ, ఆనంద ధామమునకు
జేరఁ గల్గెను పెఱ చింత చేర దచట

స్వార్థమను పంక మెఱుఁగ దచ్ఛపు సరస్సు
నీదు జీవిత కథ కృష్ణ! నిజము సుమ్మ
కానిచో, పార్థసారథిగాడ వగుట
కర్మమే గెలుపెల్ల నీ కతన గలుగ. ”

అనియె నిఁక బల్కలేడో, కన్గొనలఁ జారె
మౌక్తికము లట్టు లానందమయజలమ్ము;
లర్ఘ్యమో పాద్యమో హృదయార్పితములు
భక్తిపూర్వకనై వేద్యఫలరసములొ.

అది శుభావహం తేజోమయం బతీత
సుకృతపరిలబ్ధశాంతిభాసురము క్షణము
ఏ మన స్సేమి గడియింప నోమినదియొ,
ప్రబల మోదంబునను వృద్ధ పలికె నిటుల.

"వనమాలీ ! తరియించితిఁ గొంత యా
వంతైన లేదింక, జీ
వన యాత్రాఫల మబ్బె, సత్ ప్రణయశ్లో
భాలోకసేవాప్తి క
ల్గెను కానీ, వచియింపకుండుటకు నా
కే నిల్వనట్టుండె; మీ
రనుమోదించిన నా కథఁ వినిచి కృ
ష్ణా ! యంచు కఁ మోడ్చెదఁ."

"తల్లి ; సందేహమే వేఱు తలఁపు వలదు
అడుగఁ దలఁచియు, నాయాస మగునో యనుచు,
మానితి" నటన్న వత్సలు మాట కలరి
స్వస్థయై యాపె మరల చెప్పందొడంగె.

"జరిగిన వెన్నో కాలములు
జన్మతలం బెడఁబాసి, నేటి కా
పరమపవిత్రసీమ కళఁ
బాయదు హృత్పుటపైన, నా మనో

హారమగు సౌధభాగము వి
హారవనస్థలు లాటపట్టు లా
భరణములున్ జెలుల్ పసరుఁ
బట్టెడి బాల్యము నేమి చెప్పఁదున్.

లేఁదమలపాకుతీవ శరీర మప్పుడు
పచ్చతంగేడుపూవన్న బరగు మేన
మొగలిపువ్వులోని నునుపులు నెగడుచుండు
కనిన యువకుఁడు కన్నారఁ గనక పోడు.

ఒక సంధ్యాసమయాన భారతిని శు
ద్ధోపాసనన్ దన్ప త
న్ని కటస్థంబగు దేవళంబునకు నే
నిష్ఠాత్మనై పోవు త్రో
వకు సామీప్యమునన్ వితర్ది పయి న
వ్యస్మేరబింబాస్యుఁడై
యకలంకంబగు యౌవనప్రభలలో
నాలోచనల్ సేయుచో

కనుఁగొంటిఁ మది నాహరించిన శుభాం
గస్ఫారలావణ్యు; నా
పని యేదో స్మృతి లే; ద వెన్నడును నా
భావంబు లూహింప నే
రని నవ్యావసులఁ దిరుంగుసు మహో
రంభంబులో, నే యఁ
ర్ఘనిధిఁ ద్రివ్వి గ్రహింపనో; నిలచె నే
త్రిజ్యోతు లేకాగ్రతఁ.

రెప్ప వాల్చక కనెడి నాయొప్పుఁ గనదు;
అప్రియత్నమ్మగా జారె నపుడు నాదు
కరయుగమునుండి వెండిపళ్ళెరము భువికి,
అటులె సిల్చితి: దిగ్గున నతఁడు వచ్చి

‘బాలా! యీ యరసందె నేగ దేఁటు, మీ
వా రెట్లు నిన్నంపిరు
ద్వేలప్రార్థన లేమి కోరి సలుపఁ
దీక్షించి తిట్లంచుఁ దా

నా లీలఁ భువిఁ బడ్డ వెత్తియిడి నా
యాస్యంబులో నాస్యమై
యాలోకించెనో లేదో ఒక్కత్రుటి 'పు
త్రా!' యన్న పిల్పందినఁ

తప్పని భారమై మధుర
తాపరిణాహపు ప్రేమముద్ర నా
నొప్పుగ నొక్కముద్దును మ
దుద్యతగండతలాన నద్ది యే
చొప్పున నేగెనో, కనుఁలఁ
జూచుటకైనను బాష్పపూరముల్
జిప్పిలి దృష్టి నడ్డినవి,
జేయఁగ నెయ్యది తోఁచ దత్తఱిఁ.

ఆ మనోహరసుప్రసన్నామృతాంశు
కాంతులనె నింపె విశ్వంబు, కదలనేల ?
కడచి చననిమ్ము రయమున కాలరథము
మంజులంబైన ప్రేమవిమాన మబ్బె.

పరుల కలభ్య మీ మధుర
భావవియత్తలయాన మేమొ, ఈ
తరుణము పీటిబుత్తునె, సు
ధామయుఁ డాతఁడు, తత్ప్రకార మే
వరమపవిత్రసీమల శు
భంబుగఁ దోఁచును సంతరించి యె
వ్వరు గనలేని నా హృదయ
భద్రగుహాంతరమందు దాచెదన్.

అనుకొనినాను. ఆ పిదప
నైన విధానము గుర్తు లేదు. తె
ల్విచి గొని కాంచునప్పటికి
వెల్గుల నల్దెస లావరించు భా
నుని పొడఁగంటి. మేడపయి
నూల్కొను పాన్పున జేరియుంటి. ప్ర
క్కన శయనించి యుండె నను
గాగిటిలోఁగొని తమ్ముఁడాయొఁడ.

ఊహా కందదు జరిగిన దౌర్కాలైన
పోతబరువాయె నెడఁద, ఝుమ్మురని పలికె
బంభరం బొండు చెవిదండఁ బాసి చనియె,
నా సినాదమునం దాత్మ గందె నెదియొ.

నాఁడు మొదలుగ మా యింట నాదు పెండ్లి
ముచ్చటలఁ దల్లిదండ్రులు మునిగి యుండ్రు.
పైకిఁ జెప్పను గాని నా వాంఛ వరుని
గనఁగ నుండెను నా మనఃకలితుఁ డగునొ.

అంతయు సిద్ధమయ్యె, నిఁక
నైదు దినాలకు పెండ్లి-ఎప్పుడే
కాంతమునందు గోరెనొ మ
దఁబిక యల్లుని గాంచః నప్పుడే
మంతయు ప్రొద్దుపోదు, దిగె
నల్లుఁడు—మెల్లగఁ జూచుచుంటి నా
కాంతుఁడు గాదు-కాంక్షలు వి
ఘాతము లయ్యె, నిఁకేమి యోగ్యమో

లోకవిజ్ఞాన మెఱుఁగని పోకడలను
వేషభాషణములు మున్నె వెల్లడించె
అతని నగ లొత్తి చెప్పి ధనాఢ్యుఁడనుచు
దాన మా వారి మోద ముద్దండ మయ్యె.



అపుడు నిశ్శబ్దశర్వరి విపులగగన
వదనమున నిల్పుకొన్నవి బాష్పవారి
కణములో లేక చెమటముగ్గ లవి యగునొ
మినుకు మినుకని జారి పోవును తపించి.

అమృతకిరణుఁడు రాడాయె ననెడి వగపొ,
వాని యెడఁబాటు నోర్వఁగా లేని వెతయొ;
అతని నచిరానఁ బొందఁగా నైన తలఁపు
లేవియును తోఁచి రాక వాపోవుటేమొ.

వేగ రమ్మని నను బిల్చి యేగె భ్రమర
మపుడు, రజనీమతల్లి నా యండ యిపుడు
సంశయించేల, పిఱికిముచ్చట లవేల;
బ్రతుకుకడ దాఁక నాస్వామి వెతకికొందు.

అది మొద లింత దాఁక విప్రు
లావరణంబున దీక్షఁబూని, నా
కొదవిన వంతలఁ మనసు
నుంచక గ్రుమ్మరుదాన: నేటికిఁ
మదిపయి నాటి బాల్యరుచి
మాయఁగలే దొక యింతయేని; నాఁ
డొదవిన నాథు మన్నన-అ
దొక్కటియే మననంబు నిత్యముఁ

ఈ యుదంతము కలిగించు నెట్టి భ్రమలో
మెచ్చితల లూచినను, నోరులఁ మెచ్చుకున్న,
ఈ జరఠజీవయాత్ర నిర్వ్యాజ మమల
భావపరిపూర్ణ మగుటఁ బావనము నిజము.

తలఁపు కెక్కిన వా డధిదైవ మనుచు
అతని కైనట్టి తను విది హవ్య మనుచు
జరుపబడినట్టి ప్రేమయజ్ఞమున కిపుడు
సలుపు పూర్ణాహుతికి నీవె సాక్షి కృష్ణ''

అని చేదోయిని మోడ్చి కన్నుఁగవ మూ
యఁగ దోఁచె నా వృద్ధ జీ
వనకావ్యంబు సమాప్తిఁ జేయునటు, లా
పైఁ వ్రాలె శయ్యాస్థలిన్;
వనటం బొందిరి వత్సలాదు లపు డ
న్నన్ జాలునే; మూర్ఖుఁడై
నను కన్నీళుల దోయిళుల్ విడుచు స
న్నా! కాంచి యా దృశ్యమున్.

# చతుర్థ

"ఇఁక నెందాఁక తమఃప్రభంగమాల న
ట్టిట్టూఁగి జీవాణువుల్
బెకలింపించెదు భీతిచేత, నిఖిలో
ర్వ్యాపాసలీల మహా
త్తోఁక పర్యాయముఁ గాంచు మోయి! విడవే
మో గుండెసఁకిళ్ళు, చే
తికి నందిచ్చుము చేయి" యంచు రవి ప్రా
గ్దిక్కెక్కి చే సాచుడో,

“తరువల్ల్యాదుల కాలవాలముల నీ
ర్ద్రావింప నుప్పొంగుచున్
పరుగుల్ దీసెడి పిల్లకాలువలతో
పాఱేగ వీల్గాక తె
ప్పరలాడున్ దిలకింతువే! దరులఁ గు
ప్పల్ గుప్పలై పచ్చికల్
తరుణీ!” యన్న, నపాంగ ముత్తరముగా
దర్శించు చాత్మప్రియున్,

ఒక ప్రియపు టొయ్యారి కాల్గొలుసు లే
మో కొంత నొప్పింపఁ, డే
పకుఁ జే నొత్తెడి వేళ గల్లు మను ని
క్వాణంబు ముంజేతియం
దొక పెల్లై, యటకేగు చూపులకు నో
రూరించి, యుత్కంఠఁ బెం
చక పోనీయని పైఁడిగాజులను మిం
చన్ జూచు చేజాయలో,

నిగ్గులు చూచుకొంచు నొక
నీ టలవాటయినట్టు లోరమో
మొగ్గ తనంత లో మరియు;
నూహ గ్రహించిన వన్నె కాదు "బల్
సిగ్గుల మొగ్గవా! నగవు
చిందఁగ నీయవు? చూడు మున్న దీ
పగ్గకు నిమ్మపం డొకటి
వన్నె పసందను దేని దాకెదవే."

అని కేలాతం డిడఁ బుజాన, జెలి య
త్యంతంబు కోపేక్షణం
బున నేనో గనఁబోయి, వాని నగు మో
మున జూచి తానే మునిం
గెను హాసాబ్ధి; నొకింత సేపటి కనెన్
గ్రీఁగన్ను సారించి "వం
గిన తాంబూలివయి న్నగన్యైకసుమా
ఖేటంబులే సాధ్వులా!"

అనెడి మానవతికి జెలుఁడననయించె
సనువు చనువును మప్పిరిఁ గొనిన మాడ్కి;
కలసి విహరింతు రిర్వు రేకముగ నపుడు
వివిధఫలపుష్పభరవనవీథులందు.

ఒకట తెల్లని జాజు లొలయు పందిలి నెక్కి
ఒక రందికొనుచు నింకొకరు కోతు
రొకట వంగిన రెమ్మ కూగు మంకెనపూల
నేను నేనని ముందు కేగి కోతు
రొకట గన్పడదు చంపకము వాసనఁ బట్టి
ఒకరి కచ్చెరువుగా నొకరు కోతు
రొకట తీయని మావి కొరగి నేలను రాయు
పండ్ల కెగఁబడి సిల్వాకయె కోతు
రొకట విచ్చిన దానిమ్మ లొడిసి కోతు
రొకట వసియించి సరిచూతు రొక్కటొకటి
'నేను కోసిన దిది' 'ఎందుకైన దార,
'దంప నే గుర్తిస్తునా?' 'కాదు, తాళు' మనుచు.

హృదయమ్ముల్ మిళితమ్ములై వయసు వ
ర్తింపుల్ సుయుక్తమ్ములై
వదలింపుఁ జొరనీని బంధమున ని
ర్బంధమ్మొ స్వాతంత్రమూ
మొదలే చిక్కఁ దగోచరం బౌరుల కా
పొందింపులో సూత్ర మె
న్ని దెసల్ జోడుగ సంచరింతు రవి యె
న్నే నెయ్యపుం దీవులే,

ఆ చెలువంపు చెల్మిఁ దోల
కాడెడు బంటచెలుల్ వనస్థలిఁ
జూచుచుఁ బోయి చేరి రొక
చోటు, నటఁ దెలిఱాలగద్దె పైఁ
బూచిన పారిజాతకము
పోసిన పూవుల నింపుకొన్నదై
వేచియె యుండనోపు నప
విఘ్నులఁ జేసికొనంగ నిర్వురఁ.

పొడుపుచుల తల నున్న లేఁబ్రొద్దుసెల నొ
లుకు పసిడివెల్గువెల్లువలోన దేలి
కలుకు పూవుల తెప్పనా నొలయు గద్దె
నధివసించిరి బాల్యవిహారలీల

తోఁటలో తిరుగుచు నేరి త్రుంచుకొన్న
క్రొన్ననలు పండ్లు బోసి రిర్వురకు నడుమఁ
దీరుతీరగు పూలతో దీర్చి దండ
గ్రుచ్చుచెలి కోరు నల రిచ్చు గూర్మిఁ జెలుడు.

“ వినఁగఁ గోరుదు నా మనఃప్రణయదే
వీ! యెట్టు లిన్నాళ్ళు జీ
వనకోలంబును నొంటి నెట్టితివి? దు
ర్వారోగ్రఖేదాగ్నిఁ గ్రా
గిన నా యాత్మకు నీవు చల్లని విలో
కింపుల్ పునఃప్రాప్తవీ
క్షణ మేనాఁ డని చూచి చేసిన బ్రతీ
క్షల్ వ్రాయ నుద్గ్రంధనా.”



వత్సలుఁడు

అనఁగ జేనున్న పని నించుకంత నాపి
అంతలో నీరు నిండిన అక్షియుగళి
నట్టె పైకెత్తి బొటబొట నశ్రులొలుక
మోము వాలిచి మరి గుక్కఁబోయె యువతి.

అంత నాయమ చేదోయి నతఁడు తనదు
వామహస్తాన గ్రహియించి వ్రాలి యున్న
మోము గుడిచేతఁ బైకెత్తి ముగుదవైతి
వౌర!" యని బొటవ్రేలఁ గన్నీరు దుడిచెఁ.

పటుఁ దప్పించి కాపాడు ప్రాప్తి కలుగ
కందు భయమందు నేఁ; ధైర్య మంది సుదతి
"నాదు హృదయాంతరిక్షశూన్యప్రపంచ
మున సరాగము నింపి నీ చనుట మొదలు.

ప్రేమోగాని మనఃకురంగము సతం
బీక్షించు లోకాటవీ
సామాన్యత్రిసరేణువందయిన గాం
తాసిద్ధి నూహించి, అం

దే మాహాత్మ్యము నీ స్వరూపగత మే
దేఁ జిహ్వమున్ జూతు, బా
ధామాధ్వీకము తత్ఫలం, బదియె ప్రా
ప్తంబంచు సేవింపనే.

లోలోనన్ బ్రవహించు ప్రేమజలక
ల్లోలాల తబ్బిబ్బులో
వే శాఖోళిము [illegible]ంది హృన్నళిని యే
వీరాంశ తోఁడైన రా
గాలాపంబులు నవ్వు నాట్యములు సౌ
హార్దంపు సంభాషమా
లీలన్ జూపఁ గృతజ్ఞతన్ దలఁచె నా
లీలాత్మ కాఠిన్యమున్.

నైరాశ్యం బిగురెత్తి దూఱి మనసై
నన్ వేగ స్వీయాపరా
ధోరస్త్రాణము జించి చీల్చి తనలో
నుత్తంభితంబైన చిం

ఆరాజ్యంపు సువర్ణపీఠమున సం
దర్శించి మన్నించు మో
యీ రాజన్య యటంచు పెఁ వగచినన్
హేయంబె మాటాడుటే.

బహిరంతరంగవలయితవస్తువితతిఁ
బ్రతినదించిన బింబసంభాషణముల
తోడ గమియించి తీ నాళ్ల, త్రోవ వెంట
భావమే దారి బత్తైను పరగె నోయి!

ఈ యెడఁబాటుపాట విన
నీగుచు వేపురతిన్న బంధుతాఽఽ
నాయముఁ దప్పుకొన్న, నొక
నాఁడును వీడక ప్రాణమైన నా
కీయఁగ శంక నొందని సు
హృద్వతి నే గతి మాయఁబుచ్చి దో
షాయుతమైన నీచజని
నందు దనశ్వరశర్మ నుబ్బినన్.

ఎడఁద సడల్చి కేల్ జొనిపి
యీవి బయల్పడఁ దీసి చాటుగా
నిడి 'పదిలంబు సు'మ్మనఁగ
'నెంతటి భాగ్య' నటంచు గర్వముఁ
బడి గయికొన్న దీ వలపు;
వాసెన విప్పి పవిత్రమారుతం
బెడలఁగఁ జేసి ద్రోహము న
యించిన శృంఖలఁ జిక్కి-పోదు నే!

కడలన్ జూపక కూడలిన్ మొలుచు మా
ర్గద్వంద్వమం దే దెసన్
నడకన్ బుత్తు నటన్న సంశయగుహా
స్థగ్రంథిలోఁ జిక్కి-రా
పడు చిత్తంబును స్పందనంబుఁ గదలిం
పన్ శక్తమౌ యూహ లా
గడు వేగంబున బల్కి లేక చెలి కేల్
గీలింపులో వచ్చితిన్.

ప్రాభాతప్రభ నెత్తుకొన్నతఱి హృ
ద్రాగంబులో స్వాగతం
బాభాసించెను బర్ణశాల; విజయం
బాసించితిన్, గాని నీ
శోభాంకూరము లేడ డాగెనా? సరే-
చూపట్ట నేలా వృథా
భీభత్సాస్పదమైన జిత్తరువు వి
ద్వేషంపు బీజంబుగా?

అగు గాకే మది రాధికాప్రతిమ? నా
యాకారసామ్యంబు చ
క్కఁగఁ గన్పట్టు నటంచు భేదమతినై
కాపట్యమే నా మనో
జగతిన్ నిండిన వస్తు వన్న తలఁపుల్
సంధించి సంభాషణం
బెగఁబోసెన్ గద మా ప్రభాత! తలవే
నెత్తంగ సిగ్గొందితిన్.

ఇంతైనన్ మన సొప్ప దస్మదుభయా
భీప్సావిటంకాన నే
కాంతాధిక్యత నూని ద్వార నిసుమం
తైనన్ స్పృశింపంగ; నా
నెంతో వేదన, యాను గాక! లయ మ
య్యోన్ దృష్టియున్ బుద్ధి చి
త్రాంతఃప్రాభవమంకాఁ, దద్గతవిశు
ద్ధాత్మావబోధంబులన్.

తడిసి ముద్దయి వేదనాధార లెన్నొ
క్రుమ్మరించిన నా మనఃకుసుమ మపుడు
తీర గనుపట్టు మానినీదివ్యహృదయ
పుటపు పొల్లికలందుల మునిగి విరిసె.

మా పరస్పరమైత్రి తన్మయముగాఁగ
నఁకి మొసగిన కుటి విడనాడి మరల
సమధికప్రేమవిశ్వాసశాఖ లెక్కి
వచ్చి నిను జేరు తలఁపు లబ్రముగ నొలయు,

వని నికుంజము జేరఁబోయినది మొదలు
మరల నిను గను దాఁక మా మనసు లెట్టి
వ్యాపృతులఁ బూనెనో చెప్పవలె నదేల?
దండ నా వంతు, పటమది దాని వంతు."

అనుచు నింకేమొ వచియింప నాసపడుచుఁ
దడయును సుశీల, వత్సలుఁడెడఁదలోన
భద్రపఱచిన బృందాధివాసుఁ గనెనొ
పైకొనిన చిత్తవిభ్రాంతిఁ బలికె నిటుల.

చూపులు పావనమ్ములయి
చూడఁగ నోచె నిరత్యయమ్ము బృం
దాపతిదివ్యరూపము సు
ధామధువాణి! ఎడంద యంత్రమై
గోపకిశోరుఁ జూపు నెడఁ
గోరినవేళ ననుగ్రహించి, ఈ
పాపపు లోక మేడనొ న
భఃపృథివీస్థలులంపు నాతఁడే.

తీరుపు సేయువేళ యువ
తీమతి పోయిన పోబడుల్ బహి
స్త్రీరము నంటి యుండి నియ
తిక్ష వ ది నిల్పి గ్రహించినావె? శృం
గారపు టూహాలందు సవి
శారులు త్రోక్కరు నిర్మలాధ్వ, మొ
ప్పారుదు రా పథాన సిర
పాయముగాఁ బ్రణయర్షు లెల్లరుఁ."

' లే దోయీ! మన సుంచ లేమ. పెఱకో
ర్కెం జేరనీ దాత్మభా
వోదాత్తంబయి: పూవు పూవును సుహృ
ద్వ్యక్తిఁ బ్రసంగించు చే
దో దైవాత్మీన ప్రశ్నసంతతికిఁ బ్ర
త్యుద్గీతముల్ బాడుచుఁ
బూదండఁ రచియించు వేళఁ దలఁ పే
మో మించ లేదంతరుఁ.

కాని, బుధప్రపంచపరి
కల్పితకోవిదపట్టభద్రుఁడా !
వే నిగళంబు లున్న, వెను
వేయఁగనీక, పదంబు ముందుకే
పూని క్రమింపఁజేయు బల
పూరము నిచ్చు పదార్థ మెద్దియో
కానఁగరాదు; గోచరము
కాదొకో నీ కయినన్ వచింతువా !"

"ఆకృతియె లేని భావనావ్యక్తగుణము
గుణిని విడి కానఁబడ దోఁటి కోవిదునకు
సైత మో బాల్యచాపలేచ్ఛానువర్తి
నీ ! మనస్విని ! కనుము సందియము విడఁగ.

ఈ జపాసుమవర్ణ మెంతే జిహీర్షఁ
గొలుపు, నీ వుంచుకొనుము కోమలము సుమము,
వలయుచో నీకె పరిమళములు రజంబు,
వన్నె నీయుము, మఱువ నీ పున్నె మతివ !

మధుకణమునుండి మాధురీమహిమఁ దీయ
విమలనిర్ఝరినుండి రావమును దీయ
శీతలజ్యోత్స్నఁగల చల్వ సేకరింప
విఫలులే యైరో తెలుప రా విధిని నెవరు.

ఊర్ధ్వదృష్టుల మెలిఁగొని యుటజములకుఁ
ప్రాకి పోయెడి లతల కే బలము కలదు ?
ఉన్నయటు లుండి రవిపొడఁ గన్న కమల
మట్టె విరియుట కే పుష్టి యావహిల్లు?

ఇది నిగూఢము దృష్టి కందదు లతాంగి
ఇట్టి సంబంధమం దెవ రెంత యెంత
పాలుగొని పెంచుకొందు రా పరిమితుఁలకు
వారలే సాక్షు; లిఁక ఫల మేరి కెటులో?

తెలియక యే మనస్సు సమ
ధిష్ఠితమై యొక చోట పీడి రా
వలవదు గాఢమైత్రి గల
ప్రక్రియలో; ఆట నేమి రక్తి సాం



వత్సలుడు

తుల పాలించిన నే సుధల్ గురియు; లే
దో, కాలకూటంపు ధా
రల ముంచెత్తును కాన, పాలకులు కూ
ర్కొనఁగ రాదు ఈ వృత్తిలో.

అకలుషమైన మైత్రి హృద
యాంతరభావరహస్యవీచికా
నికరములో విలీనమయి
నిండునయేని వియోగయోగదై
వికపరిణామభేదపు వి
వేకముతోఁ బనియేల? భావ మో
డికలయి చేరనట్టివి గ
డింపఁగఁ జో టొకటేని చిక్కునే.

అప్పుడే తుచ్ఛసుఖాలకై తలఁపు లా
యాసించుటల్ మాను; ని
క్కపు టేకాగ్రతతోడ ప్రత్యాణువులోఁ
గనఁ బట్టు సౌందర్యరే

ఖపయిగ్ స్నేహసుమంబు లుంచుచు నుదీ
ఔదక్షతన్ మారుపా
టు పరిభ్రష్టము కాఁ, దపఃప్రబలవృ
ష్టిల్ గూర్తుమా — భాగ్యమే.”

అని యతఁడు పల్కె. జిజ్ఞాస యలరు దృష్టు
లార్ద్రశోభలఁ జెలునిపై యందపఱచి
నిశితవిజ్ఞానరోచిస్సుస్మిలసములు
పరఁగఁ జిరుకెంపునోట నా పడఁతి యడిగె.

“మోహనమైన రూపుఁ గని
మోహనుఁడా! సుఖపూర్తి నందఁగా
నీవు వహించుటే ఖిలమయౌని,
వశంగత మద్ది యయ్యు, సం
దేహము లేదు, ప్రేమ విష
దీర్ఘిక, కాలిడరాదు. కాని, యీ
దేహుల తీర్పు లేవి! జల
ధిన్ జలవాహిని చేరకున్నదే?

పోద మహాంపతికి దటిని
పొందెడి చోటు పవిత్ర మందు రం
దే దరిసింప నౌను బహు
తీవ్రతపస్కుల, వారితోడ సం
భేదములోన తానములఁ
బెల్లుగ నాడి, గ్రహింపనైన స
మ్మోదము నే పథాన దలఁ
పుల్ బసివట్టునో చూచి వత్తమా?"

" విషయ సుఖభోగములఁ బ్రేమ పెరుగలేక
తఱుగుననుకొందు, రక్తియు విరుగునేమొ,
వేదనాలాపమాధురుల్ వెనుకఁబడిన
వలపు విషమయమున సరిపడదె విదుషి!

వివిధసుందరవస్తుసంపృక్తమైన
చిత్రశాల ప్రపంచ మోసీ శుభాంగి!
అటఁ బ్రకాశించు మూర్తుల నగ్రగణ్య
మైన దనుటకు సందేహమా నరాత్మ?

ప్రేమధారాస్రవంతిని పెంచి పంచి
భోగకాలుష్యవిరహితోద్వేగఘటితి
నారి పోని విషాదవిస్ఫారశిఖల
వెలుఁగుఁ జూపిన వృద్ధ కంజలుల నిడవె?

జంతుకాంక్షా విముక్త విజ్ఞానమయము
ప్రేమమని కాదె చాటి చెప్పినది రాధ
ఆ ప్రవాసము సహవాస మకలుషాధ్య
బోధకము లని తల వాల్చి మ్రొక్కవేమొ?

ఉన్న దసంత మీ ప్రణయ
మో సతి! కాని, అదేమి? లేడి యే-
చిన్నవి మల్లెచెండ్లు పసి
చేతుల జారెడు రీతి నుండవై
కొన్నిరుగుల్ బడంగఁ జెవి
కోలలజంట నిగిడ్చి, పక్వలన్
పొన్నల మిన్ను కెత్తును; మ
నన్ గనుఁగొన్నదో లేదో యింతకున్"

# పంచమ

" అల్లిన దన్నివైపుల క
హార్వతి దొంగతనాననైన రాం
జెల్ల దటన్న దీక్షయొ, వి
చిత్రపు టాకుల పూలకోకతో
నెల్ల శరీరము౯ ముసుగు
లెత్తిన, దెంతటి జాగరూక ఆ
వల్లి లవంగి! - మీటును వి
పంచికనా ? అది నేర్చె నెన్నడో!

వత్సలుడు

కా దది వల్లకీరవము,
కావలె కోవెలకొమ్మగొంతు, ఆ
నాదము గూడ కా దది, వి
నందగు నచ్చపు తేటమాట, లీ
వాదము లేల? కొంత నిల
బడ్డపయిన్ అదె తెల్లమా" నటం
చాదటగొన్న చేయితుద
నల్లన దువ్వుచు లేటి నొక్కెడున్

ఒక పువ్వుదీవటింటి కెడ
నున్న రసాలపు నీడ నిల్చి, తే
ఁకు వినవచ్చు పల్కుల ప్రి
భావము కన్బొమ లెత్తి, యెద్దియో
ప్రకటితమైన బాధ్యత వి
పర్యయ మొందినరీతి, యింత వా
ల్చక కనురెప్పలన్, విను బ
రాకు రవంతయు లేక నిట్టులన్

" ఈ విపుల, ఈ వియత్తలి, ఈ మహత్తు
ఈ విభిన్నాభ్రజలనిధు, లీ యనంత
కాంతివిజ్యోతు, లే నాటి కల్పనములు?
నిత్యనవ్యోత్సవమె వీని సత్యమేమొ!

శిథిలమై దిబ్బలెత్తిన చిత్రచిత్ర
ప్రాగ్విభూపాలశృంగారపురములందు
పుడమి పులకాంకురములెత్తి ప్రాచి నవ్వ
మంచుపన్నీరు జిల్కి హసించు శశియు.

చంకనిడుకొన్న యిల్లాలి చంటిబిడ్డ
నొడిసి మొగనెత్తి నక్కల కొప్పజెప్పి
సంతసించు ప్రభంజను చర్య లెవ్వొ
ప్రతిఘటించు బ్రహ్మాండమందు బయలుపడెను.

పంటపొలముల బంగారుపైరులోన
జీవముల దాచి పవళించు సీమ సల్లె
మ్రింగి కూర్చుండి కదలక మెదలకున్న
కడలిచెద్దయముఁ గాదన్న గండ డేడి?

హేతుస్పర్శ నెఱుంగదో ప్రకృతిమా
హిష్యప్రపంచంబు ! వ్యా
ఘాతక్రూర వినాశ మొక్కట, యొకటిన్
గల్యాణమై వశ్యసం
ఖ్యాతప్రభవ, మున్నతిన్ బరపె దుః
ఖాహ్లాదవారాన్నిధుల్
లోతే చూపక ముంచ జీవతతి, నా
లోకించిరో త్రుళ్లునా!

ఒకఁడు నా మాత యిది యను ప్రకృతిఁజూచి
ఒకఁడు నా మృత్యు విది యను ప్రకృతిఁజూచి
ఒకఁడు నా కాంత యిది యను ప్రకృతిఁజూచి
ఒకఁ డిదియు నే నొకటి యను ప్రకృతిఁజూచి

విరమొగ్గ దూరి త్రావెడు తేనెటుకు మత్తు
గాను తుమ్మెదకు నిత్యాత్మ సుమగీతి
పగతు కుత్తుకఁ గోయఁ బ్రబలి నెత్తురు లోలుఁ
బోరు యోధుకు నిత్యవీరగీతి

అణు వణువునను స్నేహాజ్యోతులను నిల్పి
మరియు మూర్తికి నిత్యమోదగీతి
కడలేని కన్నీటి కడవపోతలఁ బోసి
దొరలుజీవికి నిత్యదుఃఖగీతి
గీతిన్యే లేక జీవనహేతిధార
మొక్కవోవును, బ్రతుకుపూమొగ్గ విచ్చు
తెఱుఁగకయె వాడి లోలోన నిగిరిపోవఁ
బరిమళము, తీవ్రైపై మొల్చి ప్రతిభ యేడ?

మొత్తని లేతపచ్చికల
మేయుచ జేపు నిండు టూధముల్
దప్పిర మొలక నోటికిడఁ
దాపిన గోవును జేసీక యె
త్తెత్తుచు 'అంబ! అంబ!' యని
యేడ్చు వనాలు వత్సపైఁ గృపా
యత్తత వద్దు—విప్పకుము—
ఆవు నసించపదె ప్రేమగీతికల్.



వత్సలుడు

మేఘుఁడు గాయకచారి, ఘని-
మేదిని-యాతని పేరటాండ్రు, వ
శ్లాఘువినిస్స్రుతుల్ రతు, ల
యారె! వియోగదురాపకూతనా
మోఘపరంపరల్ గవియు
మోహితుఁడై ప్రకృతిన్ స్వకీయకా
ర్యోఘముఁ జేయఁ బల్కిన వి
యచ్చరగీతికి మృత్యు వున్నదే!

'పోటుమగంటిమిన్ బరుల
మూకలఁ గెలిచి చెండు లాడు పే
పాటిది నాదు ధైర్యగుణ న,
పౌరుషలక్ష్మి విహారలీలలన్
చాటుగఁ గౌగిలించి యెడఁ
బాయదు నన్ను, నటన్న యోధుఁ డె
ప్పాటున బోరనో! తనువుఁ
బాసియు విన్పడె వీరగీతికిన్.

నలవడెడి గీతు లివి, స్థాయి కలిగనేని
ఒకటి యననేల, సర్వగీతికల నెత్తి
ఆలపింపఁగ వచ్చు లోకాలు మెచ్చ.

ఇటు లెన్నె నమృతస్రవంతికలు మొ
ల్కెత్తెఁ జనిస్థానమై
స్ఫుటపుష్పాంబిక యాచుఁ జేరి మధురా
మోదంబు నందింపఁ బీ
ల్చుట కెవ్వానికి నాస లే, దతనికై
శోకించునో! 'గర్భసం
పుటి భేదించిన మూఢ!, యంచుఁ బ్రకృతి
వ్యాధాంగి మాతృవ్యథన్"

నాల్గు వైపుల బహుళసుందరచిరత్న
రత్నఖచితము దివ్యాభరణము వ్రేల్కఁ
ద్రిప్పి చూపఁగఁ దేవకు తేప కొక్క
తళుకు మిరుమిట్లు గొలుపు విధానఁ దనదు
తలఁపు విభ్రాంతి గొల్పు పల్కులను వినుచు.

చివురు టూయెలలోన జిరునవ్వులౌ పూవు
లూఁగాడు మధురిమ మొక్కసారి
నడిమింటఁ దరణి బాణముల నల్గడలకు
నెక్కుఁబెట్టెడి భీష్మ మొక్కసారి
తెలివెన్నెలల సుధల్ జిలుకు చంద్రుని శీత
లోర్ములఁగల శాంత మొక్కసారి
సెలయేటి దరిఁ బండ్ల వెలయు మాఁవి యెడారి
నాల్కుంచు కారుణ్య మొక్కసారి
తరుణముఖసీమఁ దరగలు తరగలట్లు
హృదయభావలతాంత సంపదలు వెలికి
వెడలి చెవిఁజేరు పాటల వియ్యమొంది
చెలఁగి తొలఁగిన దెలియక మెలఁగు నతఁడు.

ఎలుఁగ దతండు చేవిడిచి
యేగిన లేడి కడింని సేద, ల
చ్చెరువుగ తీనెటింటి కిది
చేరి, కదల్చును, నోట లాగు, సం

బరమున నాకులర్ మెసవు,
ప్రక్కల కూపుచు మోవి దూర్చు; నీ
పరుసన కర్ధముగ్ గసం బ్ర
భాత బయల్ కడి చూచుచున్నెదర్.

పాట లోసంగిన వడింగొని భావ మేగి
యేగి మఱి యొక్క వడికయి యెదురుచూడ,
పీను లందీక కండ్లకు విన్నవించె,
కనులు చూపుల నంప, కాంత నవి బలసె.

అబల నొలసిన చూపుల నవల కనిపి
లేడి సేతలలో మంచిలేమి కడలి
వడి వడిగం బోవు నాతం, డే మిడుకొ శిశు!
లేడి నా లేడికన్నులలేమ గొనియె.

“ చెలింగుం గప్పెద నీ లేడి సేతలందు
ప్రీతియే తోంచెనా - స్నేహగీతి యగును.
బ్రతుకువీణియ యే పాట బాడకుండు
త్రుటిల కనరావు. నీ దృష్టి కెటులొ లలన!”

ఆనెడి వత్సలుపై మందహాసరుచులఁ
జిలికి లలితాంగి "సుకుమార! తెలుపఁగలనె
త్వాదృశుల సన్నిధి" నటన్న "దప్పు లేదు
తలఁపుఁ దెలుపఁగ శంకిల వలవ"దనఁగ.

"ఎత్తిన గీతికల్ గళల
నెన్నిటిఁ జేర్చిన రక్తిగట్టు. గాం
తెత్తిన పేరదేమి విన
నీగిన శ్రోతల నూపకున్న; నే
యెత్తును లేని గీతిక ల
యించుట మేలు హృదంతరంబునం,
దెత్తున నేగు కుత్తుక మ
హింబడఁ గోరద చెట్టు లేగినన్.

మలుపు లెత్తిఁగిన కంఠ మే మార్గమందు
పయనమయ్యెను తప్పుత్రోవలకుఁ బోదు.
కలసి వచ్చిన బాటలఁ గలపికొనును
బాట లేకున్న నొక క్రొత్తబాట సేయు.

కల దొక వింతముచ్చట స
ఖా! అది యెంత నిజమ్మొ తెల్పఁగా
వలెనని కోర్కె. చేరువయె
బాటపయిన్ వచియింతు నా తలం
పుల" నను నాతితో "అటు లె
పోవుద" మన్న నతండు వెన్కఁగా-
నెలఁత పథమ్ముఁ దీయఁ-బయ
నింతురు తోటను దాటి యిర్వురున్,

నాలుగు బారలే నడచి
నా, రపు డింతి (పయ్యంటలోన నే
మూలన దాచె నే క్షణమొ)
ముద్దులు గుల్కె- పటం బొకండు కెం
గేలున వెల్వరించి పరి
కించి సఖున్ గని చేతి కిచ్చి "ఈ
వెలుపుమాసినన్ వయసు
వీడిన బాయఁ పవేటి చిహ్నముల్ ?

వత్సలుడు

మొలచి మొలవని నూగుమీసల పసందు
చిరునగవుమోవి మెరుగారు చెక్కిళులను
గల్గు నీతఁడు ఈనాఁడు కంటఁబడును
పండువయసున, గుర్తింపవలయు నెటులు”

అనిన లలితాంగి ప్రశ్నల కతఁడు తిరిగి
ఉత్తరం బీఁదలంచుచు చిత్తరువును
గలయఁ జూచును మనసు నేకముఁగ నుంచి.
కడకు నే యంశములఁ దృష్టిఁ గనెనో పలికె.

“ పాలతి ! యిటు చూడు మెడమ కన్బొమకుపైన
కల దొకటి మచ్చ, ఫాలభాగమున నదియు:
తెలియవచ్చును కళ లెన్ని తొలఁగి యున్న.
నాసతుదివంపు మరొక చిహ్నము లతాంగి!

కాని, మఱియొక్క మాట, యే కాలమందు
వ్రాయఁబడినదో క్రొత్త పోఁబడులు లేవు;
ప్రాణ మొకయెత్తుగా భద్రపరుపఁబడిన
ప్రాత దనిమాత్ర మూహింతు, నీతఁ డెవరు?”

“ ఓ కృపావారిధీ! నిన్న నీ కుటీర
తలిని ‘జననీ’ యటంటి వాదరముఁ జూపి
మే వియోగిని, నా వృద్ధ యిడెను దీని
నీ ప్రభాతాన మీ రటు లేగ వనికి.
ఇచ్చి కర మంటి ‘పుత్రికా! యెన్నడైన
గానఁబడినంత నిట్టి మార్గమ్ము వాఘు,
నా కథాలేశమును జెప్పి వ్యాకులాస్రఁ
డైన, నొక బిందువున దీని నద్దు, మునియె.

*　　　　*　　　　*　　　　*

మాటలసందడిగా నడక
మానరు. మేఘము లావరించి స
య్యాటలఁ బుస్వలెత్తును వి
య త్తలి. భానుఁడు కానరాడు. కో
రాటల నాడ పెండవడ
లారుచు గాడుపు; లార్ద్రివేళ; ఆ
రాటము లేవి లేవు. జన
రావములే వినవచ్చె నంతలో.

పుర మది చిన్నదే యయిన
భోగము భాగ్యము పెంపుఁగన్న సుం
దరసదనాళి సాధుజన
తామృదుభాషణలోలమై నిరం
తరకలనాదబంభరవి
తానపరీతసరోజపూగసం
భరితసరస్సు కీడగును.
ప్రాగ్దిశ నా పురి కాస్య మట్టులన్

కల దొక మేడ. గోడలు మె
గంబును జూపు మెరుంగుటద్దమ
ట్లొలయును పాలగచ్చుపని
యొప్పిదమం; దట ముందు రెండు మూ
లలఁ గల గోపురంబులు ని
లంబడు గోటకు బుర్జులట్లు, లిం
ఫలు గుళికించు పూఁబరపు
బోదెల మధ్యఁగ బాట మేడకున్.

హార్మ్యపరివర్తి పుష్పితోద్యానపరిధిఁ
గలుగు సింగంపువాకిలికడకుఁ జేరి
నవల బాటను గడచి మంటపము దాటి
మెట్లపై కెక్కి రిర్వురా మెలఁత యపుడు,

"ముదిమి నొడల్ బసం దుడిగె,
మోదములేని విచారవీచికల్
గదపిన చిత్తమా గగన
కాలపయోదతరంగవీథులఁ
బెదరుచుఁ బోవ, నొఁటిగఁ ద
పించుచుఁ గన్నుల నీరు నింపి,-నే
డిది యగునేమొ?-చూచు; నిటు
లెన్నడుఁ జూడగనైతి నక్కటా!

ఎంద జేగిరి? యిక్కటు లెన్ని వచ్చె?
నొక్క నాఁడైన గన్నీటి నోడ్చఁ బోడు.
అతులగాఢానుతాపబాధాకరమ్ము
హేతు వది యేమొ? అడుగ కే నెట్లు లుందు?"

అని పదముల్ గదల్పఁ జను
నంగనతో నతఁ "డాగు మింతి! ఇ
య్యనఘునికిన్ బటంబుపయి
నాతనికిన్ గల తారతమ్యముల్
గన నగుఁ గోర్కె" యన్న, నా స
గిన్ సతి చిత్రము, నాతఁ డంది, కాం
చు నిటు నటుల్; తలోదరియు
శోకవిపాటితుఁ డున్న పీఠికిన్

చని "జనకా!" యనన్—గనుల
జారెడి యశ్రుల నద్దికొంచు "నా
జననినో! ఇంత జాగయిన
సాధ్యమె నాకిట నిల్వ" నన్న, "నో
జనక! యి దేమి, కన్నుఁగవ
జార్చితి వెన్నడు లేని నీరు? నే
వినవలె హేతు వేదో? తగు
వీలున నే వగ పాపఁ జాలనే!"

"నా కడుపు మేలిపంట ! చిన్నారితల్లి !"
అనుచుఁ గౌఁగింటఁ జేరిచి "జనని ! తనువుఁ
బాయు పూర్వము నీ సౌఖ్యపదవిఁ గనెడు
తలఁపు బరువయ్యె. కల దొక్క ధర్మ మిందు.

తన తలఁపుసెల సంద్రముఁ గోరి పరువెత్త
నెదఁ జేర్చుకొన నుబ్బు నదధి యెపుడు
తన మనసునిసి మోమున మబ్బు లేకుండ
పిలువ, "నో" యనును వెన్నెలది యెపుడు
తన చెల్మి మొగ్గ విచ్చిన యందమున నిల్వఁ
దొలిప్రొద్దు లేచు గాగి లిడ నెపుడు.
తన జాపతీవె మోవిని జూపి తల వాల్చ
"బిగి చాలు" నని వంగు విటపి యెపుడు
చెలిమిముడి వైచుకొనుటకు జీవి కపుడె
తగిన సమయము పరుల బాధ్యతలు తగవు.
కలఁగి వెతఁగొని వెడలిన తలఁపు లివ్వి
తల్లి! నీ సౌఖ్యధుని కడ్డుతగుల నేను."

అని తన తండ్రి పల్కు విని
యామెయి లేచి ప్రభాత మిత్రుఁ డో
డ్కొని మరలఁ బితఁ గదిసె;
కూర్చొని రందఱు; వృద్ధుఁ డంత "నో
వినయధురీణ!" యంచుఁ బెద
విఁ గదలించెనొ లేదొ; "తండ్రి! నే
ననివ బుధుండు కాదె" యన,
నాశిషముల్ వచించె వృద్ధుఁడుఁ.

దోయిలి మోడ్పుపై నుదురు
తూలుట మాని వత్సలుండు కెం
జాయల కేలు సాచి-కను
సైగలఁ జెప్పిన నాతి యానపై-
"నో యమరప్రభావ! కన
నోపుదె" యంచుఁ బటంబు నిచ్చె. కఁ
మాయక జూతు రిర్వురును
మోమున వృద్ధుఁడు తాల్చు మారుపుల్.

తొడిమను విడి నేలఁ బడనున్న పూవర
విచ్చు క్రొన్ననబెళ్కు విసరినట్లు
చారరాక తలఁచినచో గుండె లడలించు
నడవి పూదోటగాఁ బాడమినట్లు
నగ్నమైన దివ్వె పల్చగ నారి పోఁబోయి
గుప్పున వెల్గు నెక్కొల్పినట్లు
అమవసముందు చంద్రముని సన్నని రేక
నిండు జాబిలిగ పూర్ణించినట్లు
పరిణతవయస్సులో వాడి వడలు మొగము
ఎలరు ప్రాయంపు వేడి పొంగుల ధ్వనించె
జారిపోయిన తన జాడ లేరికొనెనో !
వింతతలఁపుల మున్గి త్రుళ్లింత లిడునో !

అనుచు ననియె వృద్ధుఁ "డో మధురాధ్వచరుఁడ!
[illegible] కాల తలఁపుసొంపు ము లెన్నొ
[illegible] ట్టి కవ [illegible] నా శి
థిల హృదయవీథి నెగురఁగా [illegible]లయు వసతి,



వత్సబుదు

భావవిహంగముల్ వగపు
పా లగుటేల? వచింపు, మెవ్వ రే
త్రోవున నుండి యీయ నిది
తాల్చితి నీ కరమందు" నన్న, "నా
ర్యా! విదితం బొనర్తు, భవ
దాలయమున్ ద్రుటి వీడి వత్తువే
మా వెనువెంట" నన్ దరుణు
మాటకు సమ్మతిం జెప్పి, మువ్వురున్

కదలి వనవాటిలోఁ బర్ణసదనమునకుఁ
జేరి, వృద్ధకుఁ బరిచర్య సేయు శీల
వతి సుశీలను జూచి, రవ్వలఁ బ్రభాత
"కుశలమే"! యన్న మొగమొక్క దిశకుఁ ద్రిప్పె

పెడమోమ ముంచు సుశీలభావము లెస్స
ప్తిం గూర్పఁగా వత్సలుం
డడుగుల్ రివ్వన సాగనిచ్చి, శయనం
బం దూర్పులే లేని యా

బడుగుం జూచి "నమోఽస్తు మాత! తుష్టి యా
పఁ లేవె జీవాణువుఁ?
కడకుఁ బాడిన నీ తపస్సునకుఁ గా
న్కాల్ గంటినీళుల్ గటా!"

అన విని తండ్రి బిడ్డలు శ
యానముఁ జేరిరి, వత్సలుండు వృ
ద్ధను గని "తల్లి! నీ పరమ
దైవ మిదే" యని చూపె వృద్ధు; నా
తని గనులారఁ గాంచి భుజ
దండము లించుక యెత్తి వాల్చి, బా
ధను భరియింపలేదొ! కను
దమ్ముల మోడిచె వృద్ధ : మోడ్పులో

వెడలిన బాష్పముల్ దివిజ
వీధికి రమ్మను పిల్పు లేమొ! వృ
ద్ధను వగ పాసి "వత్సల! వృ
షప్రణాతజ్ఞ!, ప్రభాత! తల్లి! యీ

జనుఁడు సజీవుఁడై మనఁగఁ
జాలఁడు. చేతుం హత్యఁ జేసి యే
డ్చెడు కడు పాపుఁడౌ. వసుధ
'ఛీ', యనె నంచును వ్రాలె వృద్ధపై.

** * **

* *

అది శరత్స్వచ్ఛపూర్ణిమాహారనసాంస
వేళ; పశ్చ్యద్రిగంగనావేణి వెనుక
జారుచున్నాఁడు రవి తన పేరుతోడ,
కెంపు నెమ్మోముతో నూర్పు లంపు వసుధ.

వెన్నెల చందురుండు నిసి
వేడి భరింపని వారు ముఖ్యా రు
త్పన్నవిషాదచిహ్నముల
వాడి నిలిండి తెల్లమోముల్

తిన్నగ దూర్పు దిక్కున, ప్ర
తీచిని ప్రాతికమూర్తిఁ గోలుపో
నున్న రవిన్ దినాంగన న
నూనసమీక్షలఁ గాంతు రయ్యెడన్.

అప్పు డొక చితి వేయి జిహ్వలను సాచె,
హవ్య మగుచుండె రెండు దేహములు కలసి,
కొంచె మెడముగ నిల్చి ముగ్గురు కవోష్ణ
బాష్పతర్పణముల్ జార్చి వగచి వగచి,

పర్ణగృహదేహళీసీమఁ బడసి నఘుఁడు
దోయిలించి ప్రభాత బంధురహ్లాదాస్థ
పొంగ, వత్సలుతోఁ బల్కెఁ బోయి, చెంతఁ
గల సుశీలను జూచి శోకమున ననియె.

"దివ్యసౌభాగ్య మొక కుమార్తెకు నొసంగి
దివిఁ జనిన తండ్రికిఁ బోవు తెల్వి లేదు.
మరఘుహృదయులు మీ చెల్మి మానలేను.
తాపసంగుహరే ప్రేమదాన మగుచు?"

అని సుశీలపయింబడి యశ్రులొల్కఁ
బాగుల, చెలి గ్రుచ్చుకౌగిలిఁ బొదిగి పలికె
"నా యనుఁగు ప్రాణమా! నిన్ను నవయఁజేసి
ఇహమునం దేను ద్రోహ మింకెంత గుడుతు"

ఇట్టు లన్యోన్యహృదయసూత్రేంగితముల
నల్లి పెనవైచి చూపః సంద్రిష్టమైన
వత్సలుని స్నేహాధుని రెండు పాయ లగుచు
దీవి మొల్పింపఁజెలిమి సంధింపఁ దలఁచి

అతఁడు భుజవల్లు లెత్తి సంభృతవిశుద్ధ
సూత్నమర్యాదతో వారి నాగులు వాపి,
ఇరు కెలంకుల నిరువుర బరఁగ నుడివె
క్రొత్త తలపోఁతలోఁ గోలుకొనున జగతి!

" మువురము జన్మ మందిన బ్ర
పూతముహూర్తము లెట్టివో! మనో
భవమలినాస్థలణ నులిపి
వైచి సహోదరభావబంధనం

భవమగు శుద్ధితో వెడలు
బాటను స్రష్టలమై, జగంబు కేల్
గవ జతఁజేసి మ్రొక్కులిడఁ
గైకొనుచున్, జిరునవ్వుపూలతో

తిరుగఁజవాబు లిచ్చి, జగ
తిన్ బసిపిల్లల పాలబుగ్గలన్
దొరలు తళత్తళల్ మెరసి
తూగు నమాయికమూర్తులన్ సుర
స్వరము వెలుంగఁ జేసికొని,
సౌఖ్యరమానిలయంబునన్ సహో
దరి! యని నేను బిల్వ, దరిఁ
జేరుచు 'సోదరుఁడా!' యటంచు నే!"

# శోధన



| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసింది |
|---|---|---|---|
| ౧౮ | ౬ | గౌగలించి | గౌగిలించి |
| .... | ౧౨ | వేనియుఁ | వేనియుఁ |
| ౧౫ | ౧౧ | లేమొ | వేమొ |
| ౧౭ | ౧౫ | పయిఁ | పయిఁ |
| ౨౬ | ౧౨ | తలంచ | తలచ |
| ... | ౧౫ | కధ్ధి | కద్ది |
| ౨౭ | ౪ | ఘాతంబు | ఘాతంబు |
| ... | ౧౪ | లేదో | లేదొ |
| ౨౯ | ౨ | అత్క్రాంతాస్య | అక్రాంతాస్య |
| ... | ౯ | ఘునిఁ | ఘునిఁ |
| ౨౮ | ౧౨ | మోమునున | మోమున |
| ... | ౧౪ | జూడ్క్రలఁ | జూడ్క్రలఁ |
| ౩౧ | ౧౦ | బయనించఁ | బయనించఁ |
| ... | ౧౬ | రాక్కరేఁ | రాక్కరేఁ |
| ౩౨ | ౩ | మయిన | మైన |
| ... | ౯ | నయ్యోదఁ | నయ్యోదఁ |
| .... | ౧౦ | యనుభవింపు | యనుభవంపు |
| ... | ౧౨ | దేని | దేవి |
| ౩౩ | ౧౨ | జేయుచుఁ | జేయుచుఁ |
| ౩౪ | ౩ | తాకులఁ | తాకులఁ |

| | | | |
|---|---|---|---|
| ౩౬ | ౧౪ | వల్గుల | వల్లుల |
| ౪౬ | ౫ | పఁడు | పండు |
| ... | ౧౧ | బోథనము | బోధనము |
| ౪౭ | ౩ | థామము | ధామము |
| ... | ౧౫ | నదియి | నదియొ |
| ౪౮ | ౭ | కథఁ | కథఁ |
| ౫౨ | ౧౬ | తమ్ముఁడాయెఁడ | తమ్ముఁడాయెఁడఁ |
| ౫౩ | ౫ | యిఁట | యింట |
| ౫౭ | ౨ | నట్టిటూగి | నట్టిట్టూగి |
| .... | ౪ | లీల్ | లీలా |
| ౫౮ | ౮ | ప్రియుస్ | ప్రియుఁ |
| ౬౧ | ౪ | స్వాతంత్రెమా | స్వాతంత్ర్యమో |
| ... | ౧౦ | బంట | జంట |
| ... | ౧౬ | విష్టుల | విష్టుల |
| ౬౨ | ౧ | పొడుపునుల | పొడుపుమల |
| ౬౩ | ౧౦ | మంద | మంది |
| ౬౫ | ౩ | పెఁ | పెఁ |
| ౬౭ | ౨ | హృద్రాగబుంలో | హృద్రాగంబులో |
| ౭౦ | ౬ | త్రోక్కురు | త్రొక్కురు |
| ౭౨ | ౮ | మెటె | మెట్టె |
| ౮౯ | ౪ | గుర్తింస | గుర్తింప |
| ౯౦ | ౭ | కథా | కథా |
| ౯౮ | ౧౨ | ద్రిప్పె | ద్రిప్పె, |
| ౧౦౨ | ౬ | జగతిఁ | జగతిఁ |




**సాహితీమేఖల**

చండూరు

(Via) నల్లగొండ

హైదరాబాద, (దక్కన్)




సాహితీమేఖల చిత్రకారులు

శ్రీ గిడుతూరి




**సాహితీమేఖల**

కార్యాలయం :

527, బి. పుత్లీబావ్లి,

హైదరాబాద

(దక్కన్).




